ఓం

శ్రీపరబ్రహ్మణేనమః.

# శ్రీమద్విశ్వకర్మచరిత్రాన్వయదీపిక.



ద్వి. శ్రీపార్వతీపుత్ర ◆ చిన్మయానంద
నాథమాత్మయందున ◆ సమ్మోదగొలతు
మానసంబునపూజ ◆ మహనీయముగ జేతు
స్నానమాచరించి ◆ సన్నుతింతు
వస్త్రయుగ్మంబుల ◆ వసుసశోదాయుతు
పుష్పగంధాక్షతలు ◆ పూజసేతు
శర్కరాఫలములు ◆ శాంతిగాసర్పింతు
ధూపదీపానక ◆ దోహదములు
ప్రణుతి జేసెదసాష్టాంగ ◆ ప్రాఙ్ఞతిగను
విశ్వరోగుమరక్షించు ◆ వినుతుజేతు
నంచునుతియింతువేల్పుల ◆ కాడిమూర్తి
భక్తజనపాలగణపతి ◆ భవ్యచరితా. 1

గీ. విఘ్నపతికిఁ మ్రొక్కి ♦ విఘ్నంబు లేకుండ
నిగ్రహింపవలయు ♦ నేర్పుతోడ
శీఘ్రముగను గ్రంథ ♦ సాంగంబు జేయుమి
విశ్వకర్మకర్త ♦ విమలభర్త. 2

సీ. వాగ్దేవతానాదు ♦ వాక్కుననందుండి
వాగ్దుకీర్ఘుకీ ♦ వాక్కునిమ్ము
నీకటాక్షము చేత ♦ నేర్పులన్నియునిచ్చి
గ్రంథసాంగంబును ♦ గలుగఁ జేయు
సకలశాస్త్రంబులు ♦ చదివిచూడఁగ లేదు
ప్రకటితసాహిత్య ♦ బలము లేదు
అమరకాండత్రయం ♦ బరసి చూడఁగ లేదు
పంచకావ్యశ్లోక ♦ పఠన లేదు
నీకృప చేతను ♦ నీగ్రంథమును నేను
ప్రారంభమును జేసు ♦ ప్రాజ్ఞతగను
తల్లిరక్షించుతనయుని ♦ ధన్యుజేయు
ఆయురారోగ్యసంపన్ను ♦ సమును జేయు
పరమకళ్యాణిశుకవాణి ♦ బ్రహ్మరాణి. విశ్వ 3

కం. శివకవులను ♦ హరికవులను
భువిలోపల బ్రహ్మకవుల ♦ బ్రస్తుతి జేతున్
వివరించి నిందుపదముల
చవిగొనుమీ భువిని జనులు ♦ చక్కగనిపుడున్. 4

గీ. భద్రకాళీశ శ్రీవీర ♦ భద్రమూర్తి
యింటివిలవేల్పు నెప్పుడు ♦ యిష్టసిద్ధి
యిచ్చి రక్షించు నామది ♦ నింపుమీర
పరమకళ్యాణి శ్రీవీర ♦ భద్రరాణి. 5

వ. అట్టి వీరభద్రస్వామికి, అనేక పరియాయమ్ములు, సాష్టాంగదండప్రణామంబులుం జేసి మానసపూజాదిధానంబులాచరించి కొన్ని మతగ్రంథమ్ములు పరిశీలించి అందున్న సారాంశంబులు కొన్ని తీసుకుని వేదవాక్యములు పుష్పమాలికగా పత్యరూపంబున మహాప్రబంధంబుగ ప్రపంచములో యచటైనాల్గులక్షలజీవరాసులలో మానవులకు ఖర్మలును కర్మలు కువృత్తులును సృష్టులకు వుపకరణాదులును యిచ్చిపోషించు మన్ష్టు గ్రంథమూలంబుగా రచియించి సమర్పించినకి థా ప్రారంభిత్తిలనిన

సీ. మూడక్షరంబులు ♦ మొలయకుండిననాడు
మూడుగుణంబులై ♦ మొలచినాడు
పంచభూతములును ♦ ద్భవముపొందనినాడు
పంచతత్త్వంబులై ♦ ప్రపలినాడు
షడ్దర్శనంబులు ♦ జననమొందనినాడు
షట్కర్మతతినివి ♦ స్తరలినాడు
దశదిశాంతరములి ♦ స్తారమొందనినాడు
దశవిధప్రాణముల్ ♦ దాల్చినాడు
నేడునేవింటవిశ్వేశు ♦ నిగమవంధ్యు
నాత్మనెంచుచునుగ్రాం ♦ చాద్రిభేద
నాటకములెవ్వియునులేని ♦ నాటనుండి
సారసద్గుణహారకు ♦ మారవినుతా. 6

కం. అఅన్నదిమూగాక్షరి
ఊఅన్నదిబిందు ♦ ఉపకారముకై
మఅన్నదిజోలైనది
హాయంబైప్రణవమయ్యె ♦ ఆనందముతో. విశ్వ 7

గీ. మొదలుప్రణవమాయె ♦ మోదముతోతనువాయె
తనదుసంతతినెల్ల ♦ ధరణియాయె
ఇట్టిమొదలుకన్న ♦ మఱియేదిలేదయా. విశ్వ 8

వ. స్వయంభువు ఆయినటువంటి పరంజ్యోతిస్వరూపమైన వీరాట్విశ్వబ్రహ్మమందు అఖండస్వరూపమైన వైవస్వతమనువు పుద్భవించి బ్రహ్మవిష్ణురుద్ర త్రిమూర్త్యాత్మకమైనటువంటి పంచముఖబ్రహ్మయందు ద్విభుజుడైన విశ్వకర్మపుదయించి యిచ్ఛామాత్రప్రభూసృష్టిః అనేవేదనియతని ప్రపంచము సృష్టించగలందులకు యిచ్ఛగలవాడై పంచమహాభూతతత్వంబులు నిర్మించి విశ్వాయకః ప్రోక్తో విశ్వకర్మణాం అనే వేదనియతని విశ్వనిర్మాణంబై య్యాగలంబులకు కర్మప్రారంభించెను.

సీ. ఖర్మంబుచేతను • గల్గునుభోగంబు
ఖర్మంబుచేతను • గలుగు శుభము
ఖర్మంచేతను • కైలాసగిరి కేగి
ఖర్మంబుచేతను • కష్టపడిరి
ఖర్మంబుచేతను • కామితార్థముగల్గు
కర్మంబుచేతను • కలిమి గలుగు
ఖర్మంబుచేతను • గలుగుసుజ్ఞానంబు
గలుగుఖర్మచేత • కాయశుద్ధి.

శ్లో. విశ్వమూలం విశ్వవృక్షం విశ్వజ్యోతిపరాత్పరం
విశ్వశాఖోకులోద్భవంచ విశ్వకర్మజగద్గురుః. 10

శ్లో. యేకకాలం ద్వికాలంచ యేకఆత్మ ద్వమూర్తిచ
యేకతేజంద్వితేజంచ నాదిమూలంచకారణం. 11

గీ. అసలుకాలము సఖము ◆ నర్థరాత్రియు జేసి
పోసగుమిగిలిననఖము ◆ పగలు జేసి
దివము రాత్రియు జేసి ◆ దివ్యవిశ్వబ్రహ్మ
విశ్వకర్మకర్త ◆ విమలభర్త. 12

గీ. మాఘబహుళచతుర్థి శివరాత్రి ◆ మనువుబుట్టె
ఫాల్గుణబహుళమావాస్యకు ◆ ప్రపంచంబుబక్తిపరచె
చైత్రశుద్ధపాడ్యమికిదివము ◆ తేజరిల్లె
యిట్లుసృష్టిజేసె ◆ విపరీతముగనయున. వి. 13

గీ. వక్కమానములోను ◆ వరుసగాపండ్రెండు
మాసములువత్సరం ◆ భక్తిపరచె
కృతయుగధర్మంబు ◆ కూర్మితోనిర్మించె. వి. 14

సీ. మాయప్రపంచంబు ని ◆ ర్మాణంబు జేయుటకు
మనువుబుట్టెను మాఘ ◆ బహుళను దు
వనరుచతుర్థిశివరాత్రి ◆ వైస్వమతమనువు
శివరాత్రిపురుషుడై ◆ శివుడుద్భవించె

మానసశివరాత్రియని ♦ మహాత్మ్యంబుగల్పించె
జంగమరూపుత్రి ♦ లింగమయ్యె
మూడుబూర్తులకాది ♦ మూలమైవిశ్వజ్ఞ
నామమువహించె త్రి♦ లోచనుండు
యిట్లుసృష్టికర్త ♦ నిహాపారాదులకర్త
దివమునిర్మించిన ♦ దీక్షకర్త
సకలశుభాశుభమునకు ♦సంకల్పమేకర్త. వి.

వ. ఇట్టి పరాత్పరుండైన ప్రణవస్వరూపుండగు విశ్వ జ్యోతిస్వరూపమై విశ్వనిర్మాణకర్తయైనవైవస్వత మనువు బ్రహ్మ విష్ణు రుద్ర త్రిమూర్త్యాత్మకమైన విశ్వకర్మ స్వయంభుగా వుద్భవించెను. 16

శ్లో. అనాభికమాలాద్బ్రహ్మ ఆకంఠేద్విష్ణుమేవచ
ఆశీరుషే యీశ్వరజ్ఞేయం విశ్వకర్మత్రయీతనుః.

గీ. వక్కవత్సరంబు ♦ వరుసగానిర్మించె
నాల్గుయుగములభువిని ♦ నడలిజేసె
ఆదిమూలకర్త♦ అసలువిశ్వజ్ఞుండె. వి. 17

గీ. అసలునాదికర్త ♦ నాత్మపరబ్రహ్మ
జాతులేసి రెండు ♦ పోక జేసె
పోతుపెంటిను జేసె ♦ పొందుగానసృష్టికిసి. వి. 18

గీ. విశ్వకర్మసుతుడు ♦ యిలలోనుయాశ్వరుడు
విశ్వకర్మసుతుఁడు ♦ విష్ణువనుచు
విశ్వకర్మసుతుడు ♦ యింద్రాదిదేవతలు. వి. 19

గీ. కళ్ళుచూచుటకును ♦ కాళ్ళునడచుటకును
చేతులుజేయుటకు ♦ చెవులువినుట
మనసుయూహించుట ♦ మర్యాదగల్పించె. వి. 20

గీ. తల్లిదండ్రియు చాల ♦ ధనముసంపాదించి
బిడ్డలు కొసగినను ♦ ప్రేమగలదె
అసలునుజనకర్త ♦ అత్రియనేకదా. వి. 21

గీ. యినుమమనువుచేత ♦ నీప్రపంచంబాయె
యినుమమనువుచేత ♦ యుగములంబుట్టె
యినుమమనువుచేత ♦ నిహపరాదులుగల్గె. వి. 22

గీ. దారువనుచుదెచ్చి ♦ ధనముకైదున్నుటకు
నాగలనుచుపేరు ♦ నమర్చియుండు
కాయులోహముదెచ్చి ♦ కర్రుజేసినమనువు. వి. 23

గీ. లోకమువార్తాంబు ♦ వేళ్ళతోడుతజేసి
నాగలిప్రాణించి ♦ నమ్ము మొక్క
యీయెద్దేటికిఫలనాయ ♦ మెట్లుగానుందును. వి. 24

గీ. మృగశిరరాగాన • మూడుధాన్యాదులు
కందిప్రత్తిధాన్యా • కలియబోసి
భూమిమీదనుచల్లి • భూభారమువకును. వి. 25

సీ. గ్రామాధికారులను • ప్రేమతోడుతబిలచి
మనుమయబ్రహ్మలకు • మాన్యమిచ్చె
దయగలిగివలేదు • తమబ్రతుకుటకుగాను
ధనధాన్యపంటలు • పంపుటకును
యిండ్లువాకిళ్లను • వింపైనగృహములు
నిర్మాణకర్తలను • నెమ్మనమున
వడుగులుపెళ్లిళ్ళు • వరసతో జేసియు
పుడమినిర్మించిన • బ్రహ్మసుతులు
యిట్లుసృష్టికర్త • యనుకొనవరుభ్రష్టుజనులు
తిట్టిచేయించుచున్నారు • తీవ్రముగను
వెట్టిపనలేదుకలిన • కార్యన్యమంతా. వి. 26

గీ. మయుడుదారువచేత • మహిమీదప్రజలకు
మహిమచేతనిళ్ళు • మలయుజేసె
మాతపితురులుసుతులు • మహారాజగానుంచె వి. 27

గీ. దప్పితాగుటపాత్ర • ధరణిలోనవరిచ్చె
కుడువకంచమునిచ్చె • కూర్మితోడ

వుండనిల్లునిచ్చె • పండమంచమునిచ్చె. వి. 28

గీ. మనువుమయుడు పనులు • మఱిలేక లోకముల
సాగదెవుకుజూడ • సాక్షిగాను
తల్లితండ్రియులేక • తనయులుగల్గునా. వి. 29

గీ. మంగళప్రదమైన • మంగళసూత్రంబు
అంగనమెడగట్టె • టర్ధమేదో
మూఢముల్లేయుట • మూలంబెయరుగరు విశ్వ 30

గీ. పుస్తెకట్టకముందు • పురుషుడెవ్వండైన
అత్తుకచ్చెబట్ట • టరవఱుడౌన
పుస్తెకట్టినవెనుక • పురుషుడుచైబట్టె. విశ్వ 31

గీ. నమనుభూమిత్రవ్వి • నలుతట్లగట్టెశి .
చెఱువుత్రవ్వజేయు • శ్రేష్టుడితడు
సప్తసంతతికిని • సంకల్పశిద్ధుండు. విశ్వ 32

గీ. వృత్తిలేనికులము • యుర్విలోనైదుగురు
విప్రక్షత్రియశూద్ర • పంచకులను
వృత్తులున్నకులము • వృత్తమకులములు. విశ్వ 33

గీ. వక్రవృత్తిజేసి • వసుధలోబ్రతికినది
నిక్కమైలకులము • నిన్నయమగ
సకలవృత్తులుసల్ప • సాంకర్యజాతులు. విశ్వ 34

శ్లో. బ్రాంహ్మణో భగవాన్ రుద్రో క్షత్రియోపరమో
హరిః వైశ్యో పితామహశ్చైవ యింద్రశూద్రశ్య
జాయతే. 35

గీ. పంచబ్రహ్మలుకళలు ♦ పంచాంగమును జేసి
మించినరాజులకు ♦ మెచ్చనిచ్చె
మంచిచెడ్డలుజూడ ♦మరివిప్రులకునిచ్చె. వి. 36

సీ. బ్రహ్మపౌరోహితము♦ పంచాగమునుయిచ్చి
గ్రామపౌరోహితము ♦ జేయమనుచు
కరణాలకునుకత్తి ♦ ఘుటంబులిచ్చియు
ధర గ్రామలెఖ్ఖలు ♦ నరళివాయ
కోమట్లకునుఖరా ♦ కొలునకుంచమునిచ్చి
అడ్డతన్వతక్కె ♦ డమ్మిచ్చెనిచ్చె
కాపులకునుపని ♦ గల్పించిధరణిలో
అవనిదున్నకొరకు ♦ హలమునిచ్చె
యిట్లుబదుకుదెరువు ♦ యిచ్చినవిశ్వజ్ఞ
పూజసల్పవలయు ♦ పుడమిజనులు.. విశ్వ 37

గీ. యజ్ఞంబుజేసెదరు ♦ యిలలోనద్విజులంత
యజ్ఞపురుషుండెవరో ♦యెరుక లేదు
యరుకెగాయత్రియని ♦ యనిపల్కు వేదములు. వి 38

మొదటిసూత్రతత్వంబు ♦ వదలుటనెటగలై
విధిపంచశిఖలుచే ♦ వదలుటామొ
పంచముఖోద్భవుని ♦ పంచసంస్కారములు. వి 39

సీ. తలకాయగొరిగించి ♦ తగపంచశిఖలుంచి
ద్విజులను జేరిరీ ♦ దివ్యగురుడు
పంచముఖోద్భవుం ♦ పంచసంస్కారముల
వంచనవెడలించి ♦ మించనొసగె
మనువుకోస్త్రకర్మ ♦ మయుడుసంఘంబును
త్వష్టబిక్షుపాత్ర ♦ ముష్టినొసగె
శిల్పిగోముఖమును ♦ చెన్నొందివిశ్వజ్ఞు
చెవులసంస్కారంబు ♦ సంస్కరించె
యిట్లుసూత్రతత్వంబు ♦ వదలించి
విశ్వజ్ఞద్విజులను ♦ వర్థిల్ల జేసిరిలను
ముష్టినెత్తుం బ్రబతకండి ♦ముఖ్యముగ
ఖ్యాతిమెక్కినపంచముఖ ♦బ్రహ్మయతడె.

గీ. రాచపుత్రికకైన ♦ రమ్యముగవిశ్వజ్ఞు
ముక్కుచెవులుకుట్టె ♦ ముందుగాను
ముందురంధ్రమునకు ♦ మోహముట్టుటకొరకు.వి 41

గీ. కుంచకోలను జేసె ♦ గుడిగట్టినొకరాయి
దేముడనుచుజూపె ♦ దేవపతియు
నదియుకడిగినవాని ♦ నర్చకునిగాజేసె. వి. 42

గీ. కంచరచరణముల్ ♦ గైకొనివైష్ణవుల్
విష్ణుపాదుకలని ♦ వెతలబెట్టి
నెత్తిమీఁదబెట్టి ♦ నెవరునిర్మించిరో. వి. 43

గీ. త్వష్టపాదుకలనుచు ♦ నిష్టతోనర్చకులు
శఠదపాదుకలని ♦ రూఢిగాను
నెత్తిమీఁదనుంచ ♦ నెవరునిర్మించిరో. వి. 44

గీ. ఒక్కరాయితెచ్చి ♦ పనరేగిచీల్చియు
రెండువక్కలుజేసె ♦ రెండుదముగను
పోలుపాంటియుజేసె ♦ పొందుగాపెళ్లికిని వి. 45

గీ. విశ్వకర్మకుమాళ్లు ♦ యుర్విలోహరిహరులు
విప్రక్షత్రియవైశ్య ♦ నొప్పకొనికి
పల్లకీలనుచుంచి ♦ భక్తితోమోశెదరు. వి. 46

గీ. గానుగరోకలి ♦ ఘనసంకెమునుబల్ల
తేకెలకిచ్చిన ♦ దివ్యములర
నుప్పులుదంచుకొని ♦ నూనెతీసుకబ్రతుకు వి. 47

సీ. గుంటరాయినిచ్చె ♦ గుండ్రచక్రమునిచ్చె
కుంభినికుమ్మకుని ♦ కుండ జేయు
కుండ జేసినవాని ♦కుమ్మరిగా జేసె. వి. 48

సీ. శంకుఘంటయునిచ్చి ♦ జే జేలలనుబోగడ
మెట్టజంగము మెడకు ♦ లింగమిచ్చె
బిచ్చమెత్తుచు బ్రదుకు బిరుదుముగ నిచ్చె. వి. 49

సీ. దోనెపల్కు జేసి ♦ దోవతుల్ నిర్మించ
నాడిముల్లుసగాత్ర ♦ నడక చేత
నేతకాండ్లను జేసె ♦ క్ష్మాధిపి విశ్వజ్ఞుడ. వి. 50

సీ. గొల్లలకుకావడి ♦ కొంకికర్రొకటిచ్చి
గండ్రగొడ్డలిచ్చె ♦ ఘనత మీర
చల్ల జేయుటకును ♦ చల్లకవ్వమునిచ్చి వి. 51

సీ. గ్రామమున నొక గుడి ♦ ప్రేమతో దలపెట్టి
గ్రామ దేవతయని ♦ నామమిడియె
ఆదేవతనుగొలుచు ♦ టాసాదిగా జేసె వి. 52

సీ. సూదివుంగ్రముకత్తెర ♦ సూటిగానిర్మించి
మేదినిజనులకు ♦ మెచ్చనిచ్చె
దర్జివాళ్లను జేసె ♦ధరణిలో విశ్వజ్ఞు. వి. 53

గీ. తంటసంబు జేసి ♦ తలగియ్యకత్తిచ్చి
అవని బ్రతుకమనుచు ♦ క్షురకునకు
వృత్తులన్నియునీకు ♦ యుర్విలోపలనిస్తి. వి. 54

గీ. గూండకట్టునుగట్టి ♦ గోచిలోపలబెట్టి
బోడిమునుకువేసి ♦ హరిబొబ్బకొట్టి
మూడువ్రాళ్లుతిరిగి ♦ ముష్టిసాతానంబు. వి. 55

గీ. హరిగోహరిహరి యనుచు ♦ అక్షయపాత్రయుబట్టి
తిరుపీదులనుతిరిగి ♦ తీర్థపతియు
ధరణిలోసాతాని ♦ ధన్యులెవ్వరుజేసె. వి. 56

గీ. తల్లిగర్భములోను ♦ పిల్లనచ్చుండెను
పిల్లనుదీయుటను ♦ ప్రేమతోను
అల్లుగట్లనుబిలచి ♦ అస్త్రశస్త్రములిచ్చె. వి. 57

గీ. సానిబోగాలకు ♦ చక్కగా మెడకును
కన్నెరక పురుషుడు కట్టుపుస్తి

గీ. పుస్తికట్టకముందు ♦ సానెబోగమొగాదు. వి. 58
చక్రవర్తినిజేసె ♦ జగతిలో విశ్వజ్ఞ
ముక్కవిప్రునిజేసి ♦ మోదముగను
పెక్కుదేవతలనుచు ♦ ప్రేమతో శిలలను. వి. 59

గీ. తొంటకాలువాను ♦ కుంటుతూవచ్చెను
ముంతబట్టితాను ♦ ముష్టికొచ్చె
ముంతలోముట్టేసి ♦ మోసముతో మ్రొక్కెదరు. వి.

గీ. మానంబుగాచుట ♦ మహిమీద దేవాంగి
ప్రాణంబుగాచుట ♦ ప్రాజ్ఞమయుడు
దానంబొసంగుట ♦ ధరణిలోవిశ్వజ్ఞ. వి. 61

గీ. జలము వేటకులకు ♦ వలగేలములునిచ్చి
వనమూ వేటకులకు ♦ వడిసెలు పాకి
జనని వేటకులకు ♦ జయపోటకత్తి చ్చె. వి. 62

గీ. దొమ్మరివాళ్లకు ♦ డోలాకటిబిరుదిచ్చి
బిరుదుబజాయించె ♦ భీకరమున
జనులువినుటకొరకు ♦ జయజేరివాయించె. వి. 63

సీ. సానిబోగాలకు ♦ సకలువిద్యలుజెప్పి
సంగీత సాహిత్య ♦ సరసముగను
ఆటలుపాటలు ♦ అభినయదర్పణ
నవరసశిక త్వ ♦ నాట్యముగను
గచ్చులుగమజాలు ♦ ఘనమైన మైఘుకి
ముఖమునవరస ♦ ముద్దుగుల్క

నుదెలతాళాలు ♦ మరిగజ్జెలనుగట్టి
ఘల్లుఘల్లునమ్రోయు ♦ ఘనులుమెచ్చ
యిట్లువిద్యలుసల్పుచు ♦ ముందువేళ
ముందుగావిశ్వకర్మకు ♦ వందనంబు
వెనుకసభవారిఅందరికి ♦ వేడ్కతోను. వి. 64

గీ. కన్నపుదొంగకు కన్నకత్తినిచ్చియు
తిన్నగా డతుమన ♦ దీవినిచ్చె
తిన్నదప్పి తెలిస్ను ♦ తీసిబొండేతురు. వి. 65

గీ. వృత్తి జేసెటివేళ ♦ భక్తి చేదండంబు
పెట్టుకశాయుళు ♦ ప్రేమతోను
వృత్తులకునుపకరణ ♦ మిచ్చినవారికి. వి. 66

గీ. లజ్జవిడదిసాని ♦ గజ్జలుగట్టుకుని
ముందుగా మద్దెలకు ♦ మ్రొక్కసాగె
తరువాత దండంబు ♦ తక్కినప్రజలకు. వి. 67

గీ. తురకలకును పీర్ల ♦ పంజాగనిర్మించి
పీర్లను జేసిచ్చె ♦ ప్రేమతోను
లాలుపిసునుచును ♦ లాలింతెంబుగనిచ్చె. వి. 68

గీ. రాతిమానుబల్ల ♦ రజకునకునునిచ్చి

మయులబట్లులుతికి ♦ మానవులకు
చలయుజేయుకొలకు ♦ చాకలగాజేసి. వి. 69

గీ. తురకసాయిబులను ♦ దూదేకులను జేసి
కమాందస్తానిచ్చె ♦ క్రమముతోడ
బ్రతుకుదెరవుకొరకు ♦ బాకాసానాయిచ్చె. వి. 70

గీ. సాయులవానికి ♦ చక్కనిడమృగము
శకునాలపుస్తకము ♦ శ్రీరామకథయు
పులుతోలుసంచియు ♦ భుక్తికోసరమొసగె. వి. 71

గీ. బండకత్తెరకడియాలు ♦ బండవానికినిచ్చి
నెత్తికోసుకబ్రతుకు ♦ నిత్యముగను
నెత్తికోతవాళ్ళు ♦ వృత్తియునదియనుచు. వి. 72

గీ. పారగునపముతట్టు ♦ పరగనాయుధమిచ్చి
యుర్విత వ్వబ్రతుకు ♦ దెరవుటకును
యుర్విత్రవ్వినవాని ♦ నుప్పరగాజేసి వి. 73

గీ. మాదిగవాళ్లకు ♦ మర్దించెగూటంబు
ఆరికత్తియునిచ్చె ♦ అవనియందు
పాదరక్షలుకుట్టి ♦ ప్రజలకిచ్చుకబ్రతుకు వి. 74

గీ. పృధివిశెవుచంబాయె ♦, శెవుచంబుపృధ్వియాయె

పృథివి శైవిచంబులో ♦ అధిక మేది
శైపుచం లేకుంటే ♦ శలగిపంటలు లేవు. వి. 75

గీ. పేడరొచ్చుపంట ♦ పంటభూములో బోసి
గాదుకో నేనుసకల ♦ యెహ్యాములతో
యి యేహ్యాపుపంట ♦ మహామేలుపంటనిదినిరి. వి. 76

గీ. మహినికంటు లేదు ♦ మదనగృహమునకు
చంటికంటు లేదు ♦ సహజముగను
జలముకంటు లేదు ♦ జలజాక్షి మోవికిని. వి. 77

గీ. పుష్పదింతపంకు ♦ నొప్పైనబెల్లంబు
నేమి శుద్ధి జేసి ♦ రిలమిలోను
మడిగట్టిజనులంత ♦ మయాలకూడదినిరి. వి. 78

గీ. అగ్రవర్ణ మనగా ♦ నెవరికిని చెల్లును
అగ్రమనగ ♦ చినననుట చెల్లు
అగ్రపూర్వతత్వ ♦ మది నెట్లనెరుగగు. వి. 79

గీ. తాకట్టునగలొస్తె ♦ తగనినిందులసొమ్ము
తానివ్వలేడంత ♦ ధనికుడైన
విశ్వకర్మనుజూడ ♦ కీర్తిగజాలగు. వి. 80

గీ. లక్షబంగారంబు ♦ రత్నముల్ ముత్యాలు

లెక్క దెలియరాదు ♦ ముఖ్యముగను
విశ్వకర్మనెరుగుయీ ♦ లెఖలన్నియు. వి. 81

గీ. రాళ్ళుతీసుకవచ్చి ♦ రత్నముల్ జేయుటకు
సానబట్టి ♦ చాలలేసపరచి
నామరత్నములచే ♦ నవరత్నములునయ్యె. వి. 82

గీ. విశ్వకర్మయనగ ♦ విశ్వమంతయుజూడ
దృశ్యమైనదంత ♦ విశ్వకర్మ
విశ్వకర్మములేని ♦ దృశ్యంబులేదురా వి. 83

గీ. మనువులోహస్సృష్టి ♦ మయుడుదారువుసృష్టి
త్వష్టతామ్రమసృష్టి ♦ నిష్టపరుడు
శిల్పిశిలాసృష్టి ♦ చెన్నొందువిశ్వజ్ఞ
స్వర్ణకారసృష్టి ♦ నిర్ణయముగ. వి. 84

గీ. విశ్వకర్మసృష్టి ♦ యింతంతయనరాదు
విశ్వమెల్లదృశ్య ♦ మొనదంత
విశ్వమేలువాడు విశ్వజ్ఞుడొకడే వి. 85

గీ. విశ్వకర్మసృష్టి ♦ యిలలోనుజేసుంటె
ప్రబలుకజేసుకులు ♦ బహ్మాదులైన
విశ్వకర్మలేని ♦ విశ్వంబులేదురా వి. 86

గీ. మాయలోనెబుట్టి ♦ మాయలోనెపెరిగి
మాయయందుదాను ♦ మగ్నుడయ్యె
మాయభ్రమయు లేని ♦ మతికీర్తుడను నీవు వి. 88

గీ. పంచబ్రహ్మల సృష్టి ♦ పరులెవరుజెప్ప లేరు
మించివైనసుతుడు ♦ పపంచిపెట్టె
పంచబ్రహ్మలుగూడి ప్రపంచము పాలించె. వి. 92

గీ. ముట్టుకోకురా నన్ను ♦ అంటుకోకురా నన్ను
అవతలికినడువు ♦ మనిసిగజూడుం
తొమ్మిదిముట్లుడిగి ♦ తొరగనొచ్చినబాపన్న. వి. 9

గీ. విశ్వకర్మమహిమ ♦ యిలలోనుప్రజలంగా
కానలేరుమదిని ♦ కనమలేదు
కశ్యపవుత్రుని ♦ కాకలుఖండించె. వి. 94

గీ. వడ్లవారింటను ♦ అన్నంబుదినరాదు
నీళ్లుత్రాగరాదు ♦ నిక్కముగను
వడ్లకూడెదినుట ♦ వసుధలోజనులంత. 95

గీ. కాశిలోమరణంబు ♦ కంశాలఅన్నంబు
యింతవారికిదొరుకు ♦ యింతబలము
కాశివిశ్వేశ్వరుని ♦ కంశాలచెయులెదా. వి

గీ. రాళ్ళుకేసుక వచ్చి ♦ గమ్యముగ శిల్పియు
మూడుమూర్తులు జేసి ♦ ముఖ్యముగను
మూడుమూర్తులు అది ♦ మూలమేజూడుడీ. వి. 97

గీ. మొదటజాతివాడు ♦ మోసంబు జేసెన
కడజాతివానిచే ♦ కట్టుమనిమొ
మధ్యజాతులన్ని ♦ మరియాదలేమాయె. వి. 98

గీ. నీతిమాలినడత ♦ భూతలంబునడచి
నీజాతితక్క ♦ నాజాతి యొక్క
జాతులువారొచ్చి ♦ నీతులన్నియు గనిరి. వి. 99

గీ. సకలభువనకర్త ♦ సర్వజ్ఞవిశ్వజ్ఞ
ప్రకటితగోముల్ ♦ ల్పత్తి జేసి
కాదన్న వ్యాసుని ♦ కుశీకరము ఖండించి వి. 100

గీ. విశ్వకర్మసృష్టి ♦ యింతంతయనరాదు
దృశ్యమవుటకొఱకు ♦ తోచుబుద్ధి
లోచనంబులకు ప్రతి ♦ లోచనముసిర్మించి వి. 101

గీ. కాలపురుషుడనంగ ♦ ఘనుడువిశ్వబ్రహ్మ
కాలమనియెటి ♦ ఘడియారమొనగె
యీలుకల్పిన బ్రహ్మ ♦ యింద్రాదసురలకు వి.102

గీ. అయిదుబ్రహ్మలచేత ♦ అయిదుబరులుదయించె
నాంధ్రగీర్వాణములు ♦ నమరజేసె
వేదశాస్త్రపురాణ♦మోదముతో సృష్టించె వి. 103

శ్లో. మనురూపంతిథి ప్రోక్తం వారంచమయసంభవః
నక్షత్రం త్వష్టరూపంచ దిల్పియోగతదైచ
విశ్వజ్ఞకరణంచైవ పంచాంగమధిదేవతా. 104

గీ. పుట్టుజాతులు రెండు ♦ భూమిమీదను జూడ
పోతుపెంటిగదా ♦ పొందుకొరకు
సకలజాతులలోను సతిపతులకుకర్త వి. 105

శ్లో. భూతకర్మ పితాకర్మ దాతకర్మ తథైవచ
గురుకర్మ పతేకర్మ షట్కర్మ విశ్వకర్మణః. 106

సీ. మణితస్థాప ♦ సంకల్పసిద్ధుండు
విశ్వకర్మగాక ♦ నితరులెవరు
మణ్మయవిగ్రహ ♦ నిర్మాణములుజేసె
విశ్వకర్మగాక ♦ నితరులెవరు
మణ్మయముద్రలు సరిలిగానిర్మించ
విశ్వకర్మగాక ♦ నితరులౌన
షట్కర్మనిరతుడై ♦ సర్వజ్ఞవిశ్వజ్ఞ

విశ్వకర్మగాక ♦ నితరులౌన
యిట్లువిశ్వజ్ఞమహిమలు ♦ నెంచదరమె
మూడుమూర్తులదిగా ♦ మూలమితఁడె
ఖ్యాతికెక్కిన పంచముఖ ♦ బ్రహ్మయనగా. వి.107

గీ. పగటిరాత్రిలోను ♦ పతినతిలెవ్వరో
భావించిచెప్పుడీ ♦ భావమునను
భావించిచెప్పితే ♦ బహుళనిధానుఁడ్నగుదు వి. 108

గీ. లక్షణంబును నేను ♦ నేక్షణంబును నైన
దీక్షగానొకరు నీక్షింపలేరు
దీక్షగామాగురుఁడు ♦ ప్రాక్షమేలక్షణము. వి. 109

గీ. మోక్షమిట్టిదోచూడ ♦ సూక్ష్మరూపమునందు
దీక్షగా నొకగురుఁడు సాక్షిగాను
గురుకటాక్షము వచ్చు ♦ గుణమునిబ్బరముగ. వి.

గీ. తృణముమేరువునాయె ♦ మేరువుతృణమాయె
కణముచేతజనులు ♦ ఘనులునాయె
క్షణముమందికాదు ♦ జనులెల్లనసుకొనరు. విశ్వ.

గీ. ఆత్మకంశ్యమైవ ♦ అధికులెవ్వరు లేరు
సూక్ష్మరూపమునందు ♦ సుందరుఁడు

సాక్షిసాధకముల ♦ నాజ్ఞ్యుడై దెల్పు. విశ్వ. 111

గీ. నీటిమీఁదనుబుటక ♦ రీతినున్నదిజగము
నీటిమీఁదబుటక ♦ నెట్లబుట్టె
ఆరీతినేసృష్టి ♦అవవిపైదృశ్యంబు. విశ్వ. 112

గీ. వర్ణప్రపంచంబు ♦ నెట్టుగానున్నట్లు
తొంగ్రి అధరపానం ♦ జుర్రిసట్లు
ప్రేరకుకాటుక ♦ ప్రీతిచేపెట్టినట్లు. విశ్వ. 113

శ్లో. బ్రాహ్మణానాంవనేకత్వం భూసురాణాంసనేకత్వ
విప్రాదిసర్వవర్ణానాం యేకభాండాశనంతథా. 114

గీ. వకయుక్తిలోను ♦ వున్నదితత్వంబు
పెక్కుయుక్తులెల్ల ♦ పేలవంబు
చక్కగా ఓంకార ♦ ప్రణవంబుగన్నది. విశ్వ. 115

గీ. ఆత్మయొక్కటికాద ♦ యఖిలఘటములందు
రూపుపనులువేరు ♦ రూపిగాను
జీవిజీవినిజూచి ♦ చిత్రపడుటే మాయ. విశ్వ. 116

గీ. శుక్లశోణితములు ♦ విప్రమైనకాల
మెట్లుగానుండునో ♦ సట్లు బ్రతుకు
కాలగతినిచేత ♦ కష్టసుఖములువచ్చు. విశ్వ. 117

గీ. ఆత్మయెట్టిదో చూడ ♦ అవయవంబులు లేవు
పూసాయెక్కడ ♦ రూపుపలుకు లేదు
చాటునుండెకదా ♦ సర్వమునిర్మించె. విశ్వ. 118

గీ. జ్ఞానమనగవేరె ♦ కానసంబున లేదు
జ్ఞానమనగవేరె ♦ నోరు లేదు
దేహమంటునుగలను ♦ తెలివిగాజూచితె. విశ్వ. 119

గీ. నాల్గుయుగములలోను ♦ నయమొప్పగా సృష్టి
దేవసృష్టిజేయు ♦ దేవపతియు
దేవసృష్టికర్త ♦ దేవతాబ్రాహ్మణులు. విశ్వ. 120

గీ. దివసురాత్రులు రెండు ♦ దివసమొక్కటిజూ
పక్షములను రెండు ♦ నెలయునొకటి
అయనంబులు రెండు ♦ అవివత్సరమొక్కటి. విశ్వ

గీ. స్థావరంబులునెల్ల ♦ తలలుక్రిందుగనుంచి
తల్లక్రిందుగాను ♦ తపసుజేసి
ఫలములు ఫలియించి ♦ ప్రజలబ్రతికించుటకు. విశ్వ.

గీ. కనవృద్ధినియుపశువు ♦ అమృతంబునిచ్చియు
పాలుత్రాగిఫణియు ♦ విషమునిచ్చు
కుక్కగంజిత్రాగి ♦ గుణమైనగుణమిచ్చు. విశ్వ. 124

గీ. విప్రమాటలువిని • వివేకహీను
లప్పు తెలియక ప్రజలు • ఒప్పుకొనిరి
ఆపిత్రుదేవతలకు • పెంటకూడెట్టిరి. విశ్వ. 125

గీ. వేదశాస్త్రంబులు • యెంతచదివినగాని
ఆవిద్యయందు • ఆశలేదు
చాపలు బుట్టలు • చక్కగానల్లుదురు. విశ్వ. 126

గీ. రోటికిరోకలి • పోటువెయ్యాపము నను
సూటిగానిర్మించి • సృష్టికెల్ల
పూటపూటకుభుక్తి • భోజనంబెట్టావు. విశ్వ. 127

గీ. చెరుకురసమొదుచుటకు • చెఱుకుగానుగనిచ్చి
పరాత్పరుండిలేడు పాలనకను
ధరణిలోజనులకు • దారిద్ర్యముంబాపె. వి. 128

గీ. త్రాసుకొసముయెత్తు • తకరాలుజెప్పను
తక్కెడవడబ్బెత్తు • తరుగుజెప్ప
కాటాకుపావుశేరు • ఖాడింబుగజెప్పె. వి. 129

గీ. గోళ్లునప్పికళ్లు • రోకళ్ళు తిరగళ్ళు
నిర్మితంబుగజేయు • నెమ్మనమున
ఆశనములనుకసల • ఆధారకర్తవయిన. వి. 130

సీ. అశ్వంబు ప్రజకు • వశ్యంబునాటకు
కళ్యముల్ నిర్మించు • ఘనుఁ డితండు
మదగజంబుకుచాల • మర్యాదగలుగుటకు
అంకుశము నిర్మించె • హరుఁ డితండు
పరపురుషుపరసతికి • భక్తిగలిగుండుటకు
శతమాన మొసఁగిన • శంకరుండు
అవనీపతికి జనుల • కాజ్ఞమిచ్చుటకను
ముద్రిక నొసఁగిన • రుద్రుఁ డితఁడు
యితనికన్న దైవంబు • మెవరుభువిని
సకలలోకములకాధార • చక్రవర్తి ... ... ... 131

గీ. గునపమునకుదంషం • గుణశీనుసైసను
పారకుదండంబు • భక్తితోను
గార్ధాళికమునకు • ఘనులైన బ్రముక్కెదగు. వి. 132
గీ. యేకులరాట్నంబు యేకులాడికెఱుకను విధవస్త్రీలకునిచ్చె
యేకులాడికి బ్రతుకు • వెలదులకును
యేకులోకలిగతి • లోకనిందనుబడకు. వి. 133
గీ. జోడుజోడుగూర్చి • చోద్యప్రపంచంబు
మూడులోకములోన రచ్చె • ముఖ్యముగను

మూడుమూర్తులకాది • మూలవిశ్వబ్రహ్మ. వి. 134

గీ ముక్కు చెవులుకుట్టి • ముందుకన్యను జేసి
శతమాన మొసగి సౌభాగ్యవతికి
గతిదప్పి పతిబోతె • వెధవరూపము జేసె. వి. 135

క. లోకములోనల్గురువులు
ప్రాకటముగవైయ్యకొయ్య • కాల్పుటకట్టిన్
ధారుణికంతటగురువగు
ధీరుడు శ్రీవిశ్వకర్మ • స్థిరముగ నెపుడున్. 136

గీ. సృష్టికర్తలహింప • జెట్టిపాతకులైరి
ముష్టికర్తలమీద • మోహముంచి
భ్రష్టులైపోయిరి • పాతకంబులు జేసి. వి. 137

సీ. కాశీప్రయాగలు • ఘనమైనక్షేత్రముల్
కాశినిర్మించిన ఘనుడితడు
ఈశాన్యభాగమున • శ్రీశైలమునమల్లి
ఖార్జునిర్మించి • కాశమూర్తి
ఆగ్నేయభాగమున • హాటకాలహా
స్తీశ్వరుణినిర్మించి • కాశమూర్తి
సకలవిగ్రహములు • ప్రకటితంబుగదివ్య

క్షేత్రముల్ నిర్మించె•కాశీమూర్తి
యిట్లు దేశాధిపతులకుయింపుమీఱ
తీర్థయాత్రలు సేవిస్తె•మోక్షమనియు
కాశిలోపలమృతిమైతే•ముక్తియనియు
కామహాత్యంబు చెప్పుట•నలవిగాదు. వి. 138

సీ. శివరాత్రినాయే•నిర్మలంపగలాయె
నీకరాత్రిసందు•నిభుడయెవరు
నీకరాత్రిసందు•నిర్మలాకారుండు. వి. 139

గీ. సూవిరంధ్రమునుంచి•సూటిగాజూచితే
మేదినంతయుదాల్లో•మెలయుచుండె
నారీతి నేఆత్మ•నఖిలజగములనుండు. వి. 140

గీ. ప్రత్యక్షుడై వాంశము•వృధివ్యాపస్తేజో
వాయురాకాశాది•చంద్రసూర్య
ఆదివిశ్వకర్మ•అష్టదైవంబులు. వి. 141

గీ. కనవుగోయుటకును•కొడవలినిర్మించె
పశువుమానవులకు•బ్రతుకుటకును
అనుమానప్రభువులకు•నాయుధంబులునిచ్చె. వి. 142

గీ. ప్రత్తిదూదాటకును•పత్తిరాట్నంబమర్చి

పరమేశ్వరుండితఁడు • పాలనకును యుక్తి
కింతవాఁడు యుర్వి • గోపల లేఁడు. వి. 144

గీ. విశ్వదేవుఁడనెడి • విశ్వమందుజూడ
విశ్వంసృజించిన • విశ్వకర్మ
విశ్వకర్మగాక యితరు • లెవరుందురా. వి.

గీ. హీనజాతినిగలసి • విహితంబుజేసిన
హానిజేసునువాని • హీనబుద్ధి
హానిచెయ్యకమానఁడెంత • వారికైన. వి. 146

గీ. కలిమిగలిగినవాఁడు • కులముకు మొండఁడు
చెలిమిగలిగినవాఁడు • స్నేహితుఁడు
కలిమి లేములు లేని • కడజాతితో సముడు వి. 147

గీ. పుట్టినప్పుడుబట్టె • పురిటిమైలనుచును
చచ్చినప్పుడు బట్టె • చావుమైల
మధ్యగజనులకు • మఱియెట్లువచ్చురా వి. 148

గీ. విశ్వకర్మకుమాళ్ళు • యుర్విపైజనులంత
దేములని మ్రొక్కెదరు • దివ్యములను
వాహనంబులనుంచి • వైభవంబుగమోసి వి. 149
యిట్టికర్మకంటె • యే లోకమందును

నితరదైవంబులు • లేరు లేరు
సకలలోకంబులకు • సర్వజ్ఞుడీయాత్మ. వి. 150

గీ. పృథివిపై ప్రాణులకు • బ్రతుకు దెరవిచ్చిన
పంచముఖోద్భవులు • సాలవకును
సకలజీవులకర్త • సర్వజ్ఞ విశ్వజ్ఞ. వి. 151

గీ. రాజయోగంజెప్పును • రాజిల్లుచుండును
బ్రహ్మజ్ఞానానంద • వార్ధిలోను
వాలలాను మనుండు • వన్మాద్వయనుకృపను. వి 152

గీ. నీచజాతులు చాల • నెగడివిస్తారంబు
గొర్రెలుబర్రెలు • కోటివేలు
ఘనమైన న్యగరాట్టు • ఘనసింహమొక్కటే. వి 153

గీ. భుక్తిముక్తికొరకు • భూమిమన్నెకొరకు
వాలముకగ్రుసిచ్చె • నూత్రిహాజులు
విష్టుపోషణకర్తయని • పల్కువేదములు వి. 154

సీ. పంచభూతములను • పంచైమతత్వములు
యెవరునిర్మించిరో • యెరుక లేదా
ఐదుఘటములు చేసి • అణువుపంచబడి
యెవరుగల్పించిరో • యెరుక లేదా

బొందిరూపంబెత్తి • భూమిపైపీనుగుల
భుజియించు శివుడు • పరమాత్మగాఁడా
సకలదేహ్యములను • ప్రకటితంబుగఁ గను
అకటుడై నారగింపు • హాస్యముగను
యన్నిజన్మములెత్తి • యన్నియోయీయాత్మ
దేహ్యభారము లేక • దేలుచుండి

గీ. వహ్నికెక్కినవాడు • వర్ణనుఁడుండినా
వహ్నిచేతకులము • వెలయుజగతి
వనములోనునుంచి • మలయజమున్నట్లు. వి 164

గీ. కులములోననొకడు • గుణహీనుడుండినా
కులముచెరచువాని • గుణముచేత
వనములోననొకటి • వానరమున్నట్లు వి. 165

శ్లో. కర్తాకారకశ్చైవ ప్రేరితంఅమోచితం సుకృతండు
స్స్ఫురితంచైవచత్వారసనుభాగినః.

శ్లో. ప్రథమంశిల్పిదండంచ ద్వితీయంకర్తదండయోఃతృ
తీయంచైవదండంచ త్రిదండంమోక్షకారణం. 167

# విశ్వకర్మచరిత్రాన్వయదీపిక.

## గద్య.

ఓం శ్రీమద్విరాట్ విశ్వబ్రాహ్మణపంచముఖో
ద్భవుండగు మయవంశసంభూతుండైన
తణుకు నరసన్నాచార్యను పుత్ర
డుభద్రమూర్తిచేరచియించ
బడిన విశ్వకర్మచరిత్రా
న్వయదీపిక పద్యకా
వ్యం మొదటిఆశ్వాసం
సంపూర్ణం.



